శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# కుక్కుటలింగశతకము.

క. శ్రీపీఠికాపురంబునఁ
గాపురముగనుండి భక్తగణముల నెల్లన్
జేపట్టిప్రోచుచుంటివి
గోపతివిలసత్తురంగ కుక్కుటలింగా.

క. అంగజమదభంగదయా
పాంగధరితీశ్రితాంగ వార్ధినిషంగా
గంగాశశిమారుతభు
క్పుంగవలసదుత్తమాంగ కుక్కుటలింగా.

క. నారద పారద శారద
నీరదమందార తారనిభధవళాంగా
గౌరీమనోబ్జభృంగా
ఘోరాఘతమఃపతంగ కుక్కుటలింగా.

క. పండితలోకాధారా
చండగజాసురవిదార సద్భసితాళీ
మండితశరీరధీరా
కుండలివరరమ్యహార కుక్కుటలింగా.

క. భక్షితబహుకాకోలా
దక్షాధ్వరహరణశీల దండితకాలా
వీక్షాకృతాగ్నికీలా
కుక్షిస్థితభువనజాల కుక్కుటలింగా. 5

క. చారుతరచర్మచేలా
సారాగసదృగ్యశోవిశాలా హస్తాం
భోరుహధృతత్రిశూలా
క్రూరజనోత్కరవి[illegible]ల కుక్కుటలింగా. 6

క. సూరిజనుల్ మెచ్చఁగ నా
నేరిచియున్నట్టిరీతి నిపుణతతో నీ
పేరిటనొకశతకంబుం
గూరిచి యర్పింతు నీకుఁ గుక్కుటలింగా. 7

క. ప్రాచీనఋషులు చెప్పిన
నీచరితాన్వితపురాణ నిచయము నెల్లన్
జూచుచు మదినమ్ముచు సం
కోచింపక నిను భజింతుఁ గుక్కుటలింగా. 8

క. వాలాయము సేవలు నీ
యాలయమున జరుగఁ బదగయాక్షేత్రంబుం
బాలింపుచు భక్తులకను
కూలుండవైయుంటివయ్య కుక్కుటలింగా. 9

క. ఏణధృతియుతవిలాసా
శ్రీణితకైలాస శర్వరీపతికాంతి
శ్రేణిదరహాస మేరు
క్షోణీధరవరశరాస కుక్కుటలింగా. 10

క. తుహినగిరిజాకళత్రా
దహనశశాంకార్కనేత్ర దర్పకశత్రా
బహుతర రజతాద్రిదరీ
కుహరవిహారమాణపత్ర కుక్కుటలింగా. 11

క. అమితకరుణాకటాక్షా
దమితవిపక్షా సమస్తదైవాధ్యక్షా
ప్రముదిత గౌరీకుచకుం
కుమపత్రికాకలితవక్ష కుక్కుటలింగా. 12

క. పరమేశ్వరుఁడవటంచుం
బరదైవమ్మనుచు బుధులు పలుకఁగ విని నే
నిరతంబుగ మదిలోనీ
కొరకై ధ్యానింపుచుందుఁ గుక్కుటలింగా. 13

క. అనిశమునీసన్నిధి సే
వనుగావింపుచునుభక్తవరదాయక యం
చును విపులభక్తితో నీ
కు నమస్కారములొనర్తుఁ గుక్కుటలింగా. 14

క. పలుమాఱునీదుపాదం
బులకుగ మ్రొక్కుచును మిగులఁ బూజించుచు ని
చ్చలును మహాదేవా నినుఁ
గొలిచెద ననుఁ బ్రోవుమయ్య కుక్కుటలింగా. 15

క. దళమైనమదీయ వ్యా
ధులనెల్లను శీఘ్రముగను దొలగింపుము మఱ
గులపర్వతములనెల్లను
గులిశము భేదించినట్లు కుక్కుటలింగా. 16

క. భూరితపం బర్జునుఁడు తు
షారాచలవనమునందు సలుపఁ గిరాతా
కారుడవై కృప నాతని
కోరికలనొసంగితీవె కుక్కుటలింగా. 17

క. మునుమార్కండేయమహా
మునినిన్నున్ భక్తితోడఁ బూజింపఁగనా
తనిఁబ్రోచి దండధరుమా
ర్కొనఁ దన్మదమణఁచితీవె కుక్కుటలింగా. 18

క. పురదానవులు జగంబులఁ
గరమున్ బాధింపుచుండఁగనుగోవిందున్
శరముగఁ గైకొనియాము
గ్గురినిన్ బఱిమార్చితీవె కుక్కుటలింగా. 19

క. అనుదినమునందు సాయం
తనవేళను భారతీ విధాత్రాదులు ప
జ్జనుమద్దెలతాళములను
గొనిపాడనటింతువీవె కుక్కుటలింగా. 20

క. జగములను సృజింపఁగ బెం
పఁగనాశంబొనరుపన్ సమర్థుడవీవై
నెగడుచునుంటివిగద బా
గుగఁగృపతోఁబ్రోవుమయ్య కుక్కుటలింగా. 21

క. రక్కసులును వేలుపులును
జక్కఁగజలనిధిమథించు సమయంబునఁ బెం
పెక్కిన హాలాహలమొక
గ్రుక్కంగొని మ్రింగితీవె కుక్కుటలింగా. 22

క. యానమగువృషభరాజము
పైనారోహించియుండఁ బ్రమథగణము నీ
తోనడువ వెండిగుబ్బలి
కోనలవిహరించితీవె కుక్కుటలింగా. 23

క. అంబరమె నీకునంబర
తంబొరసెఁగలాపరేఖ ధరియించుకలా
పంబయ్యెశరధియేనీ
కుంబొసఁగెను శరధియగుచుఁ గుక్కుటలింగా. 24

క. వనములను బర్వతంబుల
వనధుల దేశములనీవె వనరియొవనికిఁ
గనుపించవు నీమహిమముఁ
గొనియాడఁగఁ వశముగాదు కుక్కుటలింగా. 25

క. వెఱచుచు విపద్దశలకుఁ
మఱువక నీనామమెపుడు మదినిస్మరింతుఁ
గఱకంఠనిన్నుమనసున
గుఱిగొనిభావించుచుందుఁ గుక్కుటలింగా. 26

క. పరమేష్ఠిమున్నుగాఁగల
సురలెల్లనునీకుమ్రొక్కి స్తుతులొనరింపఁ
వరములువారలకు నభం
గురముగనీవొసఁగినావు కుక్కుటలింగా. 27

క. దినకర రజనీకరులు
న్నను దిక్పాలాదులుండినను దేవతులుం
డిన నెల్లప్రపంచంబున
కునుగారణమైతివీవె కుక్కుటలింగా. 28

క. చెంచునకు మోక్షమొసఁగితి
వంచితముగఁ లూతకహికి హస్తికిముక్తిన్
గాంచఁగఁ జేసితివిమదిన్
గొంచకనినుసన్నుతింతుఁగుక్కుటలింగా. 29

క. వారాణశిలోమృతులగు
వారలకుడిచెవిని సత్కృపం దారక మం
పారఁదెలిపి మోక్షముఁ జే
కూరుచుచున్నాఁడవీవె కుక్కుటలింగా. 30

క. మునుదారుకావనంబున
మునికాంతలునిన్నుఁ జూచి మోహించిరియె
వ్వనికిన్ నీరూపము చే
రొక్కనశక్యముగాకయుండుఁ గుక్కుటలింగా. 31

క. ఫణసాహస్రముతోడను
ఫణిపతియైననువచింపఁ బడకున్నమహో
ల్బణతన్ వర్తిల్లెడునీ
గుణములవర్ణింపఁదరమె కుక్కుటలింగా. 32

క. మ్రొక్కెదను గడుపుబంగరు
బొక్కసముగఁ జేయువాని పునకలుకంత
సృక్కులుగా వేదంబులు
కుక్కలుగాఁజేసితీవె కుక్కుటలింగా. 33

క. నారాయణప్రియుండయు
నారతమున్నీదుపాద నలినములకుజో
హారొనరించెదనన్నున్
గూరిమితోఁ బ్రోవుమయ్య కుక్కుటలింగా. 34

క. ఫలములు మెసవుచు నతిని
శ్చలమానసులగుచు నిన్ను సతతము మదిలోఁ
దలఁచుచు ధ్యానించెడియో
గులకే నీపదము దొరకుఁ గుక్కుటలింగా. 35

క. ఆచంద్రార్కులకైనను
దోఁచవు సంపూర్ణముగను స్తోత్రము సేయన్
నీచరిత లవాఙ్మానస
గోచరములు భవవిభంగ కుక్కుటలింగా. 36

క. కలశోద్భవాదిసురమా
నులు భక్తిశ్రద్ధతో నినుం గొల్వఁగవా
రల సంసృతి బంధవిము
క్తులఁ గావించితివి నీవె కుక్కుటలింగా.

క. తొలి రావణాసురుఁడు ని
న్నలఘుమతిన్ గొల్వనతని కైశ్వర్యములం
గలుగంగఁ జేసితివి భ
క్తులకున్ గల్పద్రుమమవు కుక్కుటలింగా. 38

క. పలుకులకు నగోచరమై
పొలుపొందిన నీదురూపమున్ హృదయములో
పలధ్యానింపుచు వేభం
గుల నిన్నున్ సన్నుతింతుఁ గుక్కుటలింగా. 39

క. దోసఁగులు దొలఁగుటకును నా
రసనపవిత్రత్వమొంద రచియించిన సమం
జసమగు మాలిక గావా
క్కుసుమము లర్పింతు నీకుఁ గుక్కుటలింగా. 40

క. గిరివరతనయాధిపనీ
చరణాంబుజములకు సేవ సల్పుచునుందుఁ
గరుణింపుము సర్వజగ
ద్గురుఁడవునీవేతలంపఁ గుక్కుటలింగా. 41

క. పరమేశ శర్వ గంగా
ధర శంభోయనుచునిన్నుఁ దలఁతునునాపై
నిరతము గరుణారసముం
గురిపించుచుఁ బ్రోవుమయ్య కుక్కుటలింగా. 42

క. అహరహము నీదుసేవా
స్పృహతోవర్తిలెదు నాదుహృదయమునందుఁ
విహరింపుము సదయుఁడవై
కుహనావటుకస్వరూప కుక్కుటలింగా. 43

క. ఇహపరభోగవిరామము
వహియింపుచునున్న నీదు భక్తవరేణ్యుల్
రహితభవపాశులగుదురు
గుహజనకానినుఁదలంతుఁ గుక్కుటలింగా. 44

క. శశభృద్వతంస శంకర
పశుపతినిను వినుతిసేయు వారలకెల్లన్
వశుఁడవగుచుఁ గరము నిరం
కుశవిక్రమమొసఁగితీవె కుక్కుటలింగా. 45

క. ఒచ్చెములు గల్గియుండిన
మచ్చికతోడనుక్షమించుమా సర్వజ్ఞా
హెచ్చుగనీస్తోత్రమువా
క్రుచ్చెదనను బ్రోవుమయ్య కుక్కుటలింగా. 46

క. పంచాస్య మహాదేవా
యంచునినుస్మరించునట్టి యతనిదురితముల్
ద్రుంచెదవు నీదుకృపయొక
కొంచెమయినఁ జూపుమయ్య కుక్కుటలింగా. 47

క. జలజభవాండములోపల
వెలయుచునున్నట్టిప్రాణి వితతులకెల్లన్
గలిగిన యొగ్గులకును ల
గ్గులకును గారణమవీవె కుక్కుటలింగా. 48

క. క్రందుగనఖిలజగత్తుల
యందునునీకీర్తి నిండ నచ్చెరువగుచున్
జందనములబృందములను
గుందములను బరిహసించి కుక్కుటలింగా.

క. బృందారకబృందంబుల
యందగ్రేసరుఁడవనుచు నాత్మఁదలఁచుచున్
వందనములొనర్చెదనా
కొందలమునుమాన్పుమయ్య కుక్కుటలింగా. 50

క. గజముఖజనకా శివయని
భజియించుచు భక్తిగలిగివర్తిలునీ భ
క్తజనుల స్నేహమొసంగుము
కుజనులతో స్నేహమిడకు కుక్కుటలింగా. 51

క. అంజలియొనర్చినీపద
కంజములను గొలుతునాయఘంబులనెల్లన్
భంజింపుముసింహముమద
కుంజరములఁగూల్చినట్లు కుక్కుటలింగా. 52

క. శంకర శివ శంభో వృష
భాంక మహేశ్వరయటంచు నాపదలకునే
జంకుచునిరతముమదిలోఁ
గొంకకనినుసన్నుతింతుఁ గుక్కుటలింగా. 53

క. దశనంబులూడివార్ధక
దశలోనుండినను సంతతంబునునిన్నుఁ
విశదమతిఁగొల్చువారికిఁ
గుశలంబులుకల్గుచుండుఁ గుక్కుటలింగా. 54

క. రుచిరపురుషాంగనాజన
నిచయములసృజించిపెంచి నిరతాన్యోన్య
పరిచరానురాగమునొసం
గుచునేలుచునుంటివీవె కుక్కుటలింగా. 55

క. నీకుయథావిధిగానభి
షేకంబును జేయుజనుల స్థిరతరసంతో
షాకలితులఁ గావింతువు
శోకంబులనినుఁడువోలెఁ గుక్కుటలింగా. 56

క. భూరితరభక్తినీపద
సారసములసేవఁజేయుజనులకు సుఖమిం
పారఁగ నొనగూర్చెదవుచ
కోరములకు విధుఁడువోలెఁ గుక్కుటలింగా. 57

క. ఓపశుపతినాయందుఁ
లోపములుండినను వత్సలుఁడవై యెపుడుఁ
నాపై నించుకయైనను
గోపంబును జూపవలదు కుక్కుటలింగా. 58

క. తుంటవిలుకానినణఁచిన
దంటవుతలఁచంగ నన్యదైవంబులునీ
కంటెను గలవేనిముఁగనుఁ
గొంటకుశక్యంబు గాదు కుక్కుటలింగా. 59

క. ఎన్నఁదరమె నీమహిమలు
మున్నుత్రిపురవిజయకాలమున వేదములం
బన్నితివిగుఱ్ఱములుగాఁ
గ్రొన్నలఁదలఁబూను వేల్ప కుక్కుటలింగా. 60

క. ఎప్పుడునీస్నేహంబుం
దప్పనితమునఁ గుబేరునకు నిధులబ్బెఁ
జొప్పడినీకృపగల్గిన
గొప్పసిరులుగల్గుచుండుఁ గుక్కుటలింగా. 61

క. దండిగనిరతముభక్తియు
తుండై నీయందుశ్రద్ధతో సుస్థిరుఁడై
యుండినమది నిశ్చలమగుఁ
గుండనిడినదీపమట్లు కుక్కుటలింగా. 62

క. అంభోనిధిఁదూణముగాఁ
గుంభినిరథముగను జేసికొంటివినిన్నుఁ
శంభోయనిప్రార్థించెదఁ
గుంభోద్భవముఖ్యవినుత కుక్కుటలింగా. 63

క. ఇమ్ముగ రేయిబగళ్ళు యు
గమ్ములుగడువఁగఁ జేసి కాలంబును వే
గమ్ముగఁ ద్రిప్పుచునుంటివి
కుమ్మరిచక్రంబురీతిఁ గుక్కుటలింగా. 64

క. వందేహంవరమస్మ
ద్భ్యందేహిమహేశయంచు భక్తిఁగొలుతు నీ
సందర్శనమెపుడును నా
కుం దొరకఁగఁ జేయుమయ్య కుక్కుటలింగా. 65

క. దబ్బరలంబలుకను నే
నబ్బసమొనరించినట్టు లార్యులవునటం
చుబ్బఁగవితనుగూర్చెద
గొబ్బునరక్షింపుమయ్య కుక్కుటలింగా. 66

క. మెండుగనీపదభక్తిప
రుండుసుగాకుండి పామరుండాశా బ
ద్ధుఁడె యుండునుబంగరు
కొండదనకు దొరకియున్నఁ గుక్కుటలింగా. 67

క. ఇమ్మహిలోపలవర్షశ
తమ్ములుగడచినను వృద్ధతంబొరసినమో
హమ్మువిడకుండు వెలుపుఁ
గొమ్మలనురమించియున్నఁ గుక్కుటలింగా. 68

క. సలలితమగు నీస్తోత్రం
బులచేడెందంబుమిగుల ముదమువహించున్
జలజసమూహంబులచేఁ
గొలనువిభాసిల్లినట్లు కుక్కుటలింగా. 69

క. తెలివియొకింతయునాకుం
బలుకులలో లేదు నీదుభక్తుఁడనగుచున్
మెలఁగుచునుంటిననుఁ జి
క్కులుబెట్టకమనుచుమయ్య కుక్కుటలింగా. 70

క. కలనె నను నీనామము
దలఁచకదుష్టాత్ములగుచు దర్పముతో వి
చ్చలవిడిగాఁ దిరిగెడిమూ
ర్ఖులబోధింపఁగఁ దరంబె కుక్కుటలింగా. 71

క. ఉల్లంబున సంతోషము
పెల్లుగనల్లుకొనగిరిజఁ బెండ్లాడుతఱిన్
దొల్లిగనువారికోర్కెలు
కొల్లఁగనొసఁగితివినీవె కుక్కుటలింగా. 72

క. పొంగట్టునుసింగాణిగ
రంగగుకాకోదరముల రవణంబులుగాఁ
గంగై కొంటివిమిత్తికి
గొంగవగుచునుంటివీవె కుక్కుటలింగా. 73

క. నీపదయుగళమునామది
లోపలనమ్ముచునునిచ్చలున్ నినుఁగొలుతుం
బాపములణఁచుముకరుణా
కూపారగిరీశయీశ కుక్కుటలింగా. 74

క. కనుఁగొనుటకు దుర్లభుఁడని
మనముననినుఁదలఁచినంతమాత్రంబున నే
కనుపండువగానేది
క్కనఁజూచిననుంటివౌర కుక్కుటలింగా. 75

క. బలమగుకామక్రోధం
బులుమదమాత్సర్యములును మోహవిలోభం
బులుగెల్చినవారె విర
క్తులగుచు నినుఁ గాంచుచుంద్రు కుక్కుటలింగా. 76

క. కవితారసజ్ఞులగుమా
నవులవునని మెచ్చుకొనఁగ నావాక్కులు త
క్కువయైనను నీనుతులె
క్కువగానొనరింపుచుందుఁగుక్కుటలింగా. 77

క. ఎందఱుజనులిలలోఁగల
రందఱునొక్కొక్కదైవమధికమనిరిగా
కందఱిస్వరూపమీవే
కొందఱమాటలవియేల కుక్కుటలింగా. 78

క. అలమార్కండేయునకుఁ
బలితపుయమబాధమాన్పి వానిమనిచిన
ట్టులగరుణింపుచు నీభ
క్తులతోడను బ్రోవుమయ్య కుక్కుటలింగా. 79

క. శాంతస్వరూప గౌరీ
కాంతాప్రాణేశ కాలకాలా నాతో
బంతములుమానినీదయ
కొంతైననుజూపుమయ్య కుక్కుటలింగా. 80

క. మేటియగుభవసముద్రము
దాఁటింపుమునీవెకాక దక్కులెవరు నా
నాటనుజన్మంబులుబహు
కోటులుగానయ్యెనాకుఁ గుక్కుటలింగా. 81

క. కలుషములనణఁచిమదిఁగాం
క్షలనెల్లనొసంగిశుభము ఘటియింపుచు ని
చ్చలునను బ్రోచుటకై శ
క్తులుగలరే నీవకాక కుక్కుటలింగా. 82

క. కదనమున జయముపార్థున
కొదవెనుభార్గవుఁడుక్షత్రియులఁగెల్చెనునీ
వదలకకొల్చినవారికిఁ
గొదువయొకింతైనఁగలదె కుక్కుటలింగా. 83

క. అనిశంబును నీసంద
ర్శనముంగావించియిష్టసఖుఁడై నీతో
డను మెలఁగెడుయక్షాధ్య
క్షుని సుకృతంబెన్నఁదరమె కుక్కుటలింగా. 84

క. శమదమములు మొదలగు ష
ట్కముఁబూనుచు నీదు చెంగటంబొరసినయా
ప్రమథగణంబులనెల్లను
గొమరొప్పఁగఁబ్రస్తుతింతుఁ గుక్కుటలింగా. 85

క. అనలునిలలాటమందున్
గొనబగుతిలకముగఁదాల్చుకొంటివిస్వర్గం
గనుదలను బూనితివినీ
గొనములువర్ణింపఁదరమె కుక్కుటలింగా. 86

క. నినుమాపురంబునంబూ
న్కొనినవృషభనాయకమునకున్ నందికి వం
దనమొనరిచి విఘ్నేశున
కునుగుహునకు మ్రొక్కుచుందుఁ గుక్కుటలింగా. 87

క. జడుఁడనుపామరుఁడనుదీ
నుఁడను భవత్సేవకుఁడనినున్ నమ్మితినా
యిడుమలఁదొలఁగింపుముని
గుడికిఁబ్రదక్షిణమొనర్తుఁ గుక్కుటలింగా. 8

క. అపరాధములను జేసినఁ
గృపతోడక్షమించి కనికరింపుము నీకై
జపములుతపములొనర్చెదఁ
గుపితాత్ముఁడమూఢమతిని గుక్కుటలింగా. 89

క. జటిలమగు కలియుగంబున
నటియింపుచు దుష్టులైన నరులకు నీవె
చ్చటనుంగన రాకుంటివి
కుటిలత్వమువదలికొలుతుఁ గుక్కుటలింగా. 90

క. నేమముతో నిరతమునీ
నామంబున్ హృదయమందు నమ్మిస్మరింతున్
దామరల చెల్వునగునీ
కోమలపదములనుగొల్తుఁ గుక్కుటలింగా. 91

క. లవమైననునీకునుమా
ధవునకు భేదంబు లేదు తద్రూపమె నీ
వవుచుంటివిగావునని
క్కువముగ నినునమ్మినాఁడఁ గుక్కుటలింగా. 92

క. జలజాత్ముఁడధోలోకం
బులకుంజని నీదు పాదములఁగాంచఁగలే
కలరెగదయట్టినీయడు
గులకున్ వందనమొనర్తుఁ గుక్కుటలింగా. 83

క. నెట్టుకొనుభక్తితోనీ
కట్టెదుటనునిల్చికొల్తుఁ గడుభీకరులై
నట్టియమకింకరులఁబడఁ
గొట్టిననుంబ్రోవుమయ్య కుక్కుటలింగా. 94

క. ఎట్టినరుఁడైన నీగుడి
చుట్టుఁబ్రదక్షిణ మొనర్ప శుభముల కెల్లన్
నట్టగుఁ గైలాసస్థిత
కుట్టిమచంచత్ప్రచార కుక్కుటలింగా.

క. ఓవృషభారూఢమహా
దేవవిరూపాక్ష వామదేవా నిన్నున్
భావించెద సేవించెదఁ
గోవిదనుతసత్ప్రభావ కుక్కుటలింగా.

క. పిలిచినఁ బలుకక యుంటివి
చలమా నాతోడ నీకు సద్భక్తుఁడ న
న్నలమటనొందింపక దాసఁ
గుల నెల్లసణాంచుమయ్య కుక్కుటలింగా.

క. కనుదోయిమూసినిను నా
త్మను దలఁచుచు నింద్రియముల మరలిచి ధ్యానిం
చినవారికి మోక్షము దొర
కును హస్తామలకముగను గుక్కుటలింగా.

క. దినదినమును సగుణోపా
సనముంగావింపుచున్న సాంఖ్యులకును స
న్మునిజనులకు సుజ్ఞానుల
కును బరతత్వమవునీవె కుక్కుటలింగా.

క. అనుపమభక్తియుతుఁడనా
చనుమదిలో నిన్ను నిల్పి స్తోత్రముగానే
నొనరిచినపద్యములఁ గై
కొనినన్నుం బ్రోవుమయ్య కుక్కుటలింగా.

క. ధరపైఁబీఠాపురికు
  శ ర
న యోజనముగఁ దగుదూరమునం
బోల్లుృరినా
క
వాసమగుచుండుఁ గుక్కుటలింగా. 101

మరాజకులో
మబ్రహ్మణ్యకవి వతంసునకుఁదనూ
ఁడనగురంగశాయిని
వలయమున నిను నుతింతుఁ గుక్కుటలింగా. 102

మంగళము పార్వతీధవ
మంగళముకురంగపాణి మంగళముశివా
మంగళముశంకరా నీ
కుంగరముగ మంగళంబు కుక్కుటలింగా. 103

క. క్షమశాలివాహనశకా
బ్దముశిఖదృగిభేందు సంఖ్యఁదగఁబ్లవనామా
బ్దమునంగార్తికశుద్ధా
ష్టమిఁగుక్కుటలింగనీదు శతకంబయ్యెన్ 104

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



శ్రీరామా.

## కుక్కుటేశ్వరదండకము.

జయ మృత్యుంజయ శ్రీమహా జయకాత్యాయనీపతే
శంకర సర్వజ్ఞ జయ శంభో జగత్ప్రభో.
మన్మహాదేవ దేవాధిదేవ ప్రజాధీశ నాకేశ యక్షేశ కీనాశ
భోగీశ గోత్రేశ మానీశ సంస్తూయమానప్రభా వామ
పాటీరకర్పూరమందారహారస్ఫురచ్చంద్రికాతార
[illegible]నీకాశ దివ్యాంగ గంగాసముత్తుంగరంగత్తరం
భ[illegible]కాంగ శృంగారయానస్ఫుటీకృద్ద్విరేఫావలీగీత
నందద్భుజంగేంద్రతారేంద్రచంచజ్జటాజూట లోకత్రయార్తిశ్ల
కారిధారాత్రయీయుక్తత్రిశూలేన దీవ్యత్పినాకేన సంయుక్తపాణే
లాటస్థలన్యస్తసిందూరసచ్చిత్రకభ్రాంతికృద్వహ్ని శీతాంశుసూర్యాంబక
క్షుద్రపాపావళీతూలవాతూల శీతాద్రికన్యాహృదంభోజరోలంబ లం
బోదరక్రౌంచభిజ్జన్మహేతో విరూపాక్షదక్షాధ్వరధ్వంసనప్రక్రియాశౌం
డశుండాలరాట్చర్మధారిన్ దిశాధీశమస్తస్థలీభాసమానా పమానోరుకో
టీరవాటీవాటద్రత్నరుక్కోటినీరాజితాంఘ్రి జగజ్జాలసంరక్షణోపేతదీ
క్షా సమారంభణోజ్జృంభమాణాంతరంగక్షమాస్యందనాంభోధితూణీర
ర్వీకరాధీశ మంజీరహాలాహలాహారభస్మానులిప్తాంగ భస్మాద్రిబాణాస
కైలాసశైలేశసంవాసితోల్లాస గౌరీపతే శంబరారాతిగర్వాపహారిన్ ద
గ్రీవదోర్గర్వనిర్వాపణశ్లాఘితానంతకీర్తే మహేశాష్టమూర్తే జగత్ప్ర
పాలాస్థిమాలాసమాబద్ధకంఠస్థల వ్యోమకేశ త్రిలోకేశ భూతేశ
స్రాంతరన్యస్తలీలాకురంగేశ చక్షుశ్రవఃకంకణశ్రీమదుక్షాధిరాడ్వా
గాఢ వాలీందుశోభాతిరస్కృద్దరస్మేరవక్త్రప్రభో దుర్వినీతక్ష
గణ్యాంధకారే పురారే జితారే స్మరారే మురారాతిసన్మిత్ర
ంజయామ్నాయకాలేయకార్ధాంగనారీశ యుష్మన్మహత్త్వం సు
రా యక్షగంధర్వసిద్ధాశ్చ విద్యాధరా బ్రహ్మదేవేంద్రముఖ్యా

